శ్రీరస్తు







# సీతారామకల్యాణము.

ఇది

శ్రీ పొణుకుపాటి కోటయ్యగారి

ప్రోత్సాహముచే

భగవద్భక్తులగు సుజనులకు నీతి-భక్తి-జ్ఞాన

వైరాగ్యాది బోధదాయకంబగునటుల

పులవర్తి అన్నపూర్ణయ్యశాస్త్రిచే

రచియింపఁబడెను


మొదటి కూర్పు 1000.

కాకినాడ

ది ఆల్బర్టు పవర్ ప్రింటింగు వర్క్సు, యందు

ముద్రింపఁబడెను.

రిజిష్టర్డు 1925. వెల 0-2-0.

శ్రీరస్తు.

# శ్రీ పొణుకుపాటి కోటయ్యగారి వంశావళి.

శ్రీశౌరిప్రియ భక్తియుక్తుఁడు ద్విజ • శ్రేష్ఠుండుసత్యక్షమా
సౌశీల్యాదిమహాగుణాకరుఁడుశ్రీ • శాండిల్యగోత్రోద్భవుం
డాశాపూర్ణయశుండు శ్రీ పొణుకుపా • ట్యాఖ్యాన్వయాం
భోధిరా। కాశీతద్యుతియొప్పు సాంబయసమా • ఖ్యప్రాజ్ఞుఁ
డత్యంతమున్. ౧

గీ. అట్టి సాంబయవర్యున • కరయధర్మ
పత్ని వేంకటలక్ష్మమ్మయన్ • పరమసాధ్వి
యందు బ్రహ్మయ రామయ • యనగ సుతులు
• పొడమిరిర్వురు సుగుణసం • పూర్ణులగుచు. ౨

క. ఆ యిర్వురిలో నగ్రిజుఁ
డై యొప్పు ఘనుండు బ్రహ్మ • యాఖ్యునకధిక
శ్రీయుతయగు పుల్లాంబా
ఖ్యాయువతీరత్నమంద • హాస్కర నిభులై. ౩

సీ. విమలసద్భక్తి సం • ప్రీణిత శ్రీ నార
సింహుండు శ్రీనర • సింహ ఘనుఁడు

పరిబలభక్తిజ్ఞాన • వైరాగ్యభాగ్య వి
భాసమానుండు సాం • బయ్యఘనుండు
శాంతదయా సత్య • శౌచాది సుగుణ ప
రాయణుండాదినా • రాయణుండు
బహువిధ నిజనామ • పతినసంతోషిత
కోలిసుబ్రహ్మణ్య • సుగుణశాలి.

గీ. యెసగఁబుట్టిరి నల్వురు • తనయులోలి
కలిసజన్ముని నలువద • నములఁబోలి
పాపములనెల్ల దూరంబు • పారఁద్రోలి
విమలగుణములఁ బ్రజలమె • ప్పింపఁజాలి. ౪

చ. సురుచిర సత్యసంధుఁడు య • శోనిధి నిర్మలచిత్తుఁడున్ స
దా। హరిభజనానురక్తుఁడున • హంకృతిదూరుఁడుపుణ్యకా
ర్యరత। త్పరుఁడును దారుఁడున్ బోణుకు • పాతకల్యాంబుధి
పూర్ణసోముఁడున్ । సరసగుణాకరుండ హహా • సాంబయ
సత్య నుతింప శక్యమే. ౫

గీ. అట్టి సాంబయ్యసత్యన • కధికభక్తి
నలుగ్ఫు సౌభాగ్యవతియను • సాధ్వియందు
వేంకటేశ్వరకోట యా • భిఖ్యులనగఁ
బాడమిరిద్దరుసుతులు పరి • భూతమతులు. ౬

ఉ. అందు కనిష్ఠుఁడైయలరు • నార్యజనాతిహితుండు కోటయా
ఖ్యందగు నుత్తముండు పర • మాత్మనుదన్నుగఁ గాంచునట్టి
నే। ర్పొందిన తత్త్వవేది కడు • నూర్జితుఁడున్ నిరతాన్న
దాతృతా। నందిత నిర్మలాతిథి జ • నప్రియకరుండరయంగ
నల్పుఁడే.

గీ. అతఁడు గనియెను రామసు • బ్బాంబికాఖ్య
రమణియందొక్క తనయుని • బ్రహ్మయాఖ్యు
నవలవేంకటసౌభాగ్య • మరియు ముద్దు
గులుకు ననసూయయనియొప్పు • కొమరితలను. ౮

క. ఏతాదృశగుణుఁడై నా
చేతన్ శతకంబు నొకటి • చేయించి మహా
ప్రీతిగఁ బంకజహారము
రీతిగ నర్పించెనతఁడు • శ్రీరామునకున్. ౯

గీ. అధికదయమీర రామసు • బ్బాంబికాఖ్య
సుదతితోఁ నొప్పు కోటయ • సుజనమణికి
పుత్రపౌత్రాయు రారోగ్య • భూరి భాగ్య
ములనుదయచేసి రఘునేత • ప్రోచుఁగాత. ౧౦

ఇట్లు,
పులవర్తి అన్నపూర్ణయ్యశాస్త్రి.



శుభమస్తు.

శ్రీ సీతారామచంద్ర పరమాత్మనేనమః.

# సీతారామ శతకము.



## దైవప్రార్థన పద్ధతి.

క. శ్రీ పొనుకుపాటి వంశా
కూపారసమగ్రసోము • కోటయనామున్
జేపట్టి సనువుమధిక
శ్రీపూర్ణునిగా నొనర్చి • సీతారామా. ౧

క. శ్రీ విఘ్నేశునిదొలుతన్
భావించి విరించి సతిని • భజియించి మరిన్
శ్రీ వెంకటరమణగురున్
సేవించెద మేలుగలుగ • సీతారామా. ౨

క. ఇలనాల్గునైదు వేయును
పలుకంగలవారలైన • దగరనివిబుధుల్
బలుకంగ నొక తలవాఁడను
తెలువుగ నిను బొగడఁగలనె • సీతారామా. ౩

క. ప్రతికల్పంబున మాయా
చతురుఁడవై బ్రహ్మ విష్ణు • శంకరనామా
కృతులం ధరించి సృష్టి
స్థితి లయములొనర్తు వీవె • సీతారామా. ౪

క. తామసమువిడచి మదినొక
కామమునుంగోరకుండి • కడుభక్తిని నీ
నామమువదలనివారికి
క్షేమముగలిగింతు వెప్డు • సీతారామా. ౫

క. ఆలింపుము నాదు మొరన్
చాలింపుము కరుణతోడ • భక్తుఁడ నాపైఁ
జాలింపుముకోపము పరి
శీలింపుము నాదుమనసు • సీతారామా. ౬

క. ఆతత సంసారార్ణవ
భీతుఁడనై నిన్ను శరణు • వేడితిఁగరుణన్
బోతమవై దాటింపుము
చేతఃప్రభవాభిరామ • సీతారామా. ౭

క. శరణాగత జనవత్సల
కరుణాకర పరమపురుష • కలికలుషహరా
సురముని సన్నుతసమర
స్థిరవిక్రమశత్రు భీమ • సీతారామా. ౮

క. నవనవమేఘశ్యామా
రవికులజలరాశిసోమ • రాక్షసభీమా
పరివిమలసుగుణస్తోమా
శివనుత మహనీయనామ • సీతారామా.

క. కుశలవులమాడ్కి నాకును
కుశలంబొనరింప వలయు • గుణరత్ననిధీ
విశదముగ నన్నుమాడవ
శిశువునిగాఁ జూచికొనుము • సీతారామా. ౧౦

—: సుజనపద్ధతి :—

క. నీతియుభక్తియుధర్మ
ప్రీతియువినయమునుగలిగి • వెలయు మహాత్మున్
బోరితువు విభీషణునివలె
చేతఃప్రియమొదవ మిగుల • సీతారామా. ౧౧

క. తులువలు చూపోపకకడు
చలమున విఘ్నంబులెన్ని • సలిపినగానీ
బలవత్తర భక్తిఁడీలన్
జెలువగు నీసేవవిడఁడు • సీతారామా. ౧౨

క. పరిహాసంబునకైనను
బరుషపుమాటలనుగాని • పనులంగానీ

యొరుమనసు నొవ్వనీడ
చ్చెరువుగసుజనుండు భువిని • సీతారామా. ౧౩

క. ఇప్పుడమినేరికేనియు
నొప్పుగఁదాఁజేసినట్టి • యుపకారంబున్
మెప్పునకై యితరులతోఁ
జెప్పఁడుతానెప్పటికిని • సీతారామా. ౧౪

క. కలనైనగల్ల లాడఁడు
వలపుననిలుపండు మనసు • పరవనితలపై
ఖలజనుల గోష్ఠిసేయఁడు
చెలువుగసుజనుండు భువిని • సీతారామా. ౧౫

క. ఘనుడెంత ధనముగల్గిన
మనమునదా గర్వపడఁడు • మాన్యులయెడలన్
వినయంబును విడనాడఁడు
చెనటిపనుల్ సేయఁడెపుడు • సీతారామా. ౧౬

క. కడుఘనుని మానవిభవము
చెడుగుల దుర్భాషణములఁ • జెడదెన్నటికిన్
బుడమినిజంగముపరపతి
చెడునేశునకములుమొఱుగ • సీతారామా. ౧౭

క. శత్రునిపైనియుదుశ్చా
రిత్రముఁగల్పింపఁడెపుడు • ప్రియమొనరించున్

గృత్రిమ గుణములఁదాల్పఁడు
చిత్రింబుగ సుజనుఁడెపుడు • సీతారామా. ౧౮

క. న్యాయంబు గయాచకసము
దాయంబున కర్థమిచ్చుఁ • దానిప్పించున్
జేయునుసత్కార్యంబులు
చేయించును సుజనుఁడెపుడు • సీతారామా. ౧౯

క. అలఘుల సంగతినల్పుఁడు
వెలయును ఘనుడగుచుఁబరశు • వేదినిసోకన్
లలి నిను మునువర్ణంబై
చెలువొందిన మాడ్కిభువిని • సీతారామా. ౨౦

—: దుర్జనపద్ధతి :—

క. ఇలమోళ్లననుచు నట్లును
శిలలైనను గఱఁగునట్లుఁ • జేయఁగవచ్చున్
దులువలహృదయంబులు రం
జిలఁజేయఁగ బ్రహ్మతరమె • సీతారామా. ౨౧

క. ఇంచుకయుఁదనకు లాభము
నెంచకనిర్హేతుకముగ • నెపుడు సుజనులన్
వంచకుఁడై దుష్టుఁడు హిం
సించును వృశ్చికముభంగి • సీతారామా. ౨౨

క. క్రూరాత్మునిహృదయంబున
గారుణ్యము కలుగదెంత • కష్టముపడినన్
గారణములెన్ని పన్నిన
జేరునె వేమునకుతీపి • సీతారామా. ౧౩

క. ఘనులు తనకెన్ని లాభము
లానరించిన మెచ్చఁడధముఁ • డుర్విస్థలిలో
జనులెన్ని నగలుభూషిం
చిన మెచ్చునె కొయ్యబొమ్మ • సీతారామా. ౧౪

క. అతిఘనుని వేషమున దా
నతినీచుండధికుఁడగునె • యల్పుఁడు గాకన్
సతతము తుండముకలదని
సితగజమునకెనయెదోమ • సీతారామా. ౧౫

క. ఖలధనము ఖలులకేయగు
బాలుపుగ సజ్జనులకగునె • భుజియింపగవే
ములపండ్లు కాకులకువలెఁ
జిలుకలకుపయోగమగునె • సీతారామా. ౧౬

క. కడు నీచు నాశ్రయించిన
గడతేరును నెంతఘనుని • గౌరవమైనన్
బుడమి నిడంకముకలసిన
జెడదే బంగారుమహిమ • సీతారామా. ౧౭

క. కడు నీచులు సుగుణములన్
విడనాడుచుఁ దోషములనె • వెదకుదురిలలో
నోడలెల్లమాని యీఁగలు
చెడురణములె వెదకునట్లు • సీతారామా. ౨౮

క. గురులోభి నెంతఁగొలచిన
సరగున దారిద్ర్యముడఁపఁ • జాలఁడు ధరణిన్
బిరికిని శరణొందిన నె
చ్చెర నభయంబీయఁగలఁడె • సీతారామా. ౨౯

క. అనయము ఖలులతిపరిచయ
మున జేతురు నాదరంబు • పూజ్యులకెపుడున్
శునకము లతి లాలన జే
సిన నాకవె మీఁద నెక్కు • సీతారామా.

—: ధ ర్మ ప ద్ధ తి :-

క. వలనుగ ధర్మము నెల్లెడ
నిలుప నధర్మంబు నణప • నేర్పరివై నీ
విల నవతరించుచుందువు
చెలువారఁగ యుగయుగమున • సీతారామా. : ౩౦

క. ఎచ్చటధర్మము నిలుచును
నచ్చట విజయంబు నిశ్చ • యంబుగ గలుగున్
మెచ్చగు సత్యముగలచోఁ
జెచ్చెరసిరి గల్గునట్లు • సీతారామా. ౩౧

క. గురుతరమగు యశమిందును
బరమందునఖండసుఖము • పార్జించుటకున్
బరమంబగు ధర్మమె సు
స్థిరమగు సాధనముగాదె • సీతారామా. ౩౩

క. క్రితువులొనర్చుట సత్య
వ్రితమూనుట భూతదయయు • బహుశాంతియుఁదా
తృతయును మొదలగు గుణములె
క్షితినుత్తమధర్మమరయ • సీతారామా. ౩౪

క. కాయక్లేశము ప్రాణా
పాయమ్మను నఖిలవిత్త • భంగమునైనన్
న్యాయముఁదప్పిన పనులం
జేయరుధర్మాభిరతులు • సీతారామా. ౩౫

క. మునుమున్ను ధర్మపరులగు
జనులిడుములఁబడిన దనకు • సమధిక సుఖులై
మనుదురు కడు పథ్యముఁజే
సిన రోగులకరణి నెపుడు • సీతారామా. ౩౬

క. అనిశము ధర్మముఁదప్పని
మనుజులకష్టములఁబాపి • మనుతువు యదునం!
దను డలపాండవులనుఁబ్రో
చి నగతి బహుసుఖములిచ్చి • సీతారామా.

మేలగు సత్రింబులు దే
వాలయములు నిల్పుటయును • నర్థులకోర్కుల్
పాలించుటయును వితరణ
శీలికి ధర్మంబుగాదె • సీతారామా. ౩౮

క. ఘనమగు నాయువు నర్థం
బును గామముయశముబలము • పుణ్యము సుఖముల్
గని మనుటకు ధర్మముమిం
చిన సాధనమొకటిగలదె • సీతారామా. ౩౯

క. బలు పుణ్యాపు కృత్యంబులు
నలుపుట దోషంపుపనులు • నలుపమియునుగా
కిలలో వేఱుగనున్నదె
చెలువగు ధర్మంబనంగ • సీతారామా. ౪౦

—: అ ర్థ ప ద్ధ తి :—

క. ధనమున వశమగు సర్వం
బునుగావున మిగులఁగష్ట • ములకోర్చియునై
సను మెండుగ ధనమునె నే
ర్చినగతి నార్జింపవలయు • సీతారామా. ౪౧

క. విత్తము లేనపుడెంతటి
యుత్తముఁడైనను బ్రశస్తి • నొందఁడు జగతిన్
నెత్తావిలేని సుమమును
జిత్తంబున మెత్తురెవరు • సీతారామా. ౪౨

క. ధనమును ధర్మమునకు సా
ధనముగ నార్జించునతఁడె • తగు నిహపరసౌ
ఖ్యములఁగాంచును బ్రజమె
చ్చినగతి నార్జించుటొప్పు • సీతారామా. ౪౩

క. తొలిజన్మంబున ధన ము
ర్థులకిడుటఁ గలిగె నిపుడు • ధ్రువముగ ముందుఁ
గలుగు నిపుడిడిన ననుచుఁ
జెలువుగఁ బ్రాజ్ఞుఁడు గ్రహించు • సీతారామా. ౪౪

క. కడులోభియర్థమర్థుల
కిడఁడదికడ తేరుననుచు • నీయమిచే వ్రే
ల్మిడి పైజన్మంబున వ
చ్చెడి లేమి నెఱుంగఁడకట • సీతారామా. ౪౫

క. వందలకొలది ధనంబును
బొందిన తన వెంట రాదు • భువిలో ననుచున్
డెందమున నరసి యర్థుల
జెందించెడు నతఁడె సుమతి • సీతారామా. ౪౬

క. కులమునకు వన్నె దెచ్చును
బలమిచ్చును సొగసుఁ గూర్చు • బహుసుఖమొసగున్
జెలిమిఁ గలిగించుఁ గలిమిన్
జెలువుగ వర్ణింపనశమె • సీతారామా. ౪౭

క. వనితాకనకంబులలోఁ
గనకమె ఘనమగును వనిత • కడు యువకుల నా

స్థనుగొల్పు వశీలజన రా
జిని గనకము మోహపెట్టు • సీతారామా. ౪౮

క. నీ కృపగల యతఁడర్థము
గైకొనుటదియేమి గొప్ప • కార్యముజగతిక్
శాశ్వతముగ సురరాజ్యముఁ
జేకొనినైనను జెలంగు • సీతారామా. ౪౯

క. కేవలముగఁ గామంబున
కై విత్తముఁ గూర్చుటొప్ప • దంతియకాని
భావింప నీదుపదముల
సేవకుఁగూర్చుటయె మేలు • సీతారామా. ౫౦

—: కామపద్ధతి :—

క. పొందుగ ధర్మార్థంబుల
కెందును భంగంబుగలుగ • నీయక విషయా
నందంబులపైఁ గోరికఁ
జెందుట తగు కామమంచుఁ • సీతారామా. ౫౧

క. తన శత్రువులందెల్లను
ఘనులంత శ్శత్రులందు • కామముఘనమై
చనుగాపునఁ గామము గె
ల్చినయాతఁడె శత్రువిజయి • సీతారామా. ౫౨

క. కడ తేయను ధనమయశము
వాడమును గష్టంబు లొసఁగు • పుణ్యంబడఁగున

గడు కామికి నెయ్యేల నీ
జెడునిహ పరసుఖము లెల్ల • సీతారామా.　౫౩

క. కేవలకామాతురుఁడగు
రావణుగతిఁ జెడును నిన్ను • రహితుండైనన్
గావున గేవలకామము
సేవించుట మిగులహాని • సీతారామా.　౫౪

క. అనవరత విషయభోగం
బున హెచ్చునుగాని కామ • ముశమింపదిలన్
గొనకొని ఘృతమెంతయుఁ బో
సిననారు నెమంటునగ్ని • సీతారామా.　౫౫

క. కామము తగదాకవేళన్
గామించిన నీ పదములె • కామింపవలెన్
బ్రేమించి శ్రితులకధిక
క్షేమములిచ్చెదవుగాన • సీతారామా.　౫౬

క. ఉన్నతర విజ్ఞానధనము
హరియించెడి కామచోరు • నాఖ్యలు హృత్సౌ
ధరము దరిజేరనీరుు
చెరుతురు ధృతిశాలిసూరి • సీతారామా.　౫౭

క. కామాదిదుష్టసంగతిఁ
బ్రేమింప నిజనుల సుఖుల • విధమున బహుళ న

త్కామితములఁదీర్చుచు సు
శ్రీమంతులఁజేయుదీవు • సీతారామా. ౫౮

క. జగతిని దుర్వ్యసనంబులఁ
దగులక నీ దగు సన్నుతి • దాటక తగురీ
తిగఁ గామసుఖంబుల వా
సిగ నొందుటతప్పుగాదు • సీతారామా. ౫౯

క. కాంతయుఁగనకంబును బల
వంతపువిషయమ్ములందు • వ్యసనముగల వాఁ
డెంతయు బాయుం బవలును
జింతిలుమది శాంతిలేక • సీతారామా. ౬౦

—: మోక్ష పద్ధతి :—

క. ఇందును ముందునుగల యా
నందములెల్లను దలంచు • నయముగ మోక్షా
నందము తా నెప్పటికిని
జెందదు నాశంబు నహహా • సీతారామా. ౬౧

క. సన్మనిహృదయధ్యేయుని
జన్మజరామరణరహితు • శాశ్వతుఘను వి
ద్వన్మానసీయు విభునిను
జిన్మయుఁగనుటయె ముక్తి • సీతారామా. ౬౨

క. నినుధ్యానించుచు పెంపు
క్కినతోడను యోగి ధరిమర • కట న్యాయం

బున నీవయగుచుఁగడు హె
చ్చినసుఖమైచెలఁగునెపుడు • సీతారామా. ౬౩

క. ఘన యోగరతుఁడు నీపై
నెనరున నీలోన గలసి • నీవేయగు నె
ట్లన నీరము పాలంగల
సిన బాలై యులరుగాదె • సీతారామా. ౬౪

క. సాలోక్యము సామీప్యము
చాలగ సారూప్యమవల • సాయుజ్యమనన్
నాలుగు తెఱగుల మోక్షు
శ్రీలలనామణి చెలంగు • సీతారామా. ౬౫

క. వలనుగ నీ భక్తులతోఁ
జెలిమియు సంభాషణంబు • సేయుచుఁబహు ని
ర్మలులగు పుణ్యాత్ములకున్
జెలువగు సాలోక్యమమరు • సీతారామా. ౬౬

క. హరినారాయణ పరమే
శ్వర మాధవశౌరి భక్త • వరదా! యని నిన్
గరముభజించెడు నరులకు
స్థిరమగు సామీప్య మమరు • సీతారామా. ౬౭

క. వర కుసుమంబుల నీపద
సరసిజములనెపుడు పూజ • సల్పెడు నధిక

స్థిరభక్తితత్పరుల క
చ్చెరువగు సారూప్యమమరు • సీతారామా. ౧౮

క. ఘనమగు జగంబునంతయు
నినుగాఁ నినుదన్నుగాఁగ • నిశ్చయబుద్ధిన్
గనుసతనికి సన్నిటిమిం
చినదగు సాయుజ్యమమరు • సీతారామా. ౧౯

క. మనుజుఁడు ముక్తి సుఖముమఱ
గిన నన్యసుఖంబు లిచ్ఛ • గింపఁడు నిదురన్
గనునా తండమృతము ని
చ్చిన మెచ్చునె నిదురమాని • సీతారామా. ౨౦

## —: భ క్తి ప ద్ధ తి :—

క. ఎంతెంత వెతలురానీ
యింతంతనరాని సిరులు • నెనగినగానీ
యెంతయు భక్తుండన్యముఁ
జింతింపఁడు నిన్ను దక్క • సీతారామా. ౨౧

క. ఎక్కుడువిద్యలునేర్చిన
మిక్కిలి ధనవంతుఁడైన • మేలగువ్రతముల్
పెక్కులుఁ క్రతువులొనర్చిన
జిక్కవు సద్భక్తిలేక • సీతారామా. ౨౨

క. మంగళగుణుఁడగు నీ భ
క్తుంగనుగొని యముఁడు వెరచుఁ • గుంభినియందు
త్తుంగంబగు మాతంగము
సింగముఁగని వెరచినట్లు • సీతారామా. ౨౩

క. కరముల నినుఁ బూజించుట
శిరమున మ్రొక్కుటయు జిహ్వ • చేఁ బొగడుటయున్
నిరతము మదిఁదలచుట సు
స్థిర భక్తికి లక్షణంబు • సీతారామా. ౨౪

క. కుందమ్ములఁ గెందమ్ముల
గందమ్ములఁబూజసేసి • కందమ్ములనిన్
సందర్శించు మహాత్ములు
చెందెదరు శుభంబులెల్ల • సీతారామా. ౨౫

క. కొందరు రాజ్యములొందిరి
కొందరు బలపౌరుషములు • కొందరు ముక్తిన్
గొందరు దీర్ఘాయుష్యము
జెందిరి నీ భక్తిజేసి • సీతారామా. ౨౬

క. గిరులందు మేరువుంబలెఁ
దరులందును గల్పకము వి • ధంబున మెరయున్
నరులందు నీదుభక్తుఁడు
చిరతరసత్కీర్తిఁజెంది • సీతారామా. ౨౭

క. తనువెల్లఁబులకరింపఁగ
గనులం దానందబాష్ప • కణములు గ్రమ్మన్
వినుచుందురు నీ కథలులభిం
చినతరి నీ భక్తులెప్పుడు • సీతారామా. ౨౮

క. నీవే తల్లియుఁ దండ్రియు
నీవే గురుఁడవును దోడు • నీడయు నీవే
నీవే దైవంబని నిను
సేవించును భక్తుఁడెప్పుడు • సీతారామా. ౨౯

క. కామక్రోధాదులఁ దా
నేమియుఁ జొరనీక కడు జి • తేంద్రియుఁడై నీ
నామమె నుడువుచు నిజహృ
త్సీమన్నిను భక్తుఁడరయు • సీతారామా. ౩౦

—: జ్ఞా న ప ద్ధ తి :—

క. సురనర గిరిముఖ్యచరా
చరరూపంబగు జగంబ • సత్యంబనియున్
బరమాత్మ సత్యమనియును
స్థిరముగ నెఱుగుటయె యెఱుక • సీతారామా. ౩౧

క పరవనితను దల్లివలెన్
బరధనమును మంటిబెడ్డ • వలెను జనులనెం
దరినిం దనవలె గాంచును
స్థిరమతి విజ్ఞానియెపుడు • సీతారామా. ౩౨

క. సారంబగు విజ్ఞానము
భూరి మహాశాస్త్ర రంగ • ములఁ బొంగెడు సం
సారాబ్ధిదాటి నీ దరిఁ
జేరఁగనోక గొప్పనావ • సీతారామా. ౮౩

క. సమలోష్ఠకాంచనుండును
సమశీతోష్ణుండును సమ • శత్రుహితుండున్
సమసుఖదుఃఖుఁడునై మిం
చి మహిన్విజ్ఞానియలరు • సీతారామా. ౮౪

క. భానుఁడు వొడమినతోడనె
మానుగఁ జీకటి నశించు • మాడ్కిని జగతిన్
జ్ఞానము వొడమినతోడనె
క్షీణంబై చెడున విద్య • సీతారామా. ౮౫

క. కనబడునవి యెల్లనుమరి
వినబడునవి యెల్లమరియు • విశ్వంబెల్లన్
మనమున నిన్నుగభావిం
చిన ఘనునకెకలుగు ముక్తి • సీతారామా. ౮౬

క. జ్ఞానంబను ప్రాసాదము
పై నారోహించి ముక్తి • వనితామణితో
మానుగనిత్యానందము
చే నెనఁగును యోగిముఖ్యుఁడు • సీతారామా. ౮౭

క. నీవే కర్త్రవు భర్త్రవు
నీవే సంహార్త్రవనియు • నిఖిలమునకు నీ
వేవిభుఁడవనియు జ్ఞానులు
సేవింతురు నిన్నెరింగి • సీతారామా. ౫౮

క. జ్ఞానాంజనమున ముక్తిని
ధానముఁగని ధనికులైన • ధన్యాత్ములకుఁ
నానా విధవిభవంబుల
చే నొప్పు జగంబు తృణము • సీతారామా. ౫౯

క. ధీమంతులు జ్ఞానాసిని
గామక్రోధాదిరిపుల • ఖండించి యశ
శ్శ్రీమీర మోక్షరాజ్య
శ్రీమించి సుఖంతురెపుడు • సీతారామా. ౬౦

## —: వై రా గ్య ప ద్ధ తి :—

క. ఘోరంబగు సంసృతిపైఁ
గూరిమిగలవారు వెతలఁ • గుందెదరందుఁ
వైరాగ్యముగలవారిఁ
జేరదుభయమెన్నటికిని • సీతారామా. ౬౧

క. ఇలసత్కృంతనవనితా
దులుభోగానంతరమున • దుఃఖదములుగా

దెలిసియు వాని భజింపరు
చెలువొందు విరక్తులెపుడు ♦ సీతారామా. ౯౨

క. కాయములు నీటిబుగ్గలు
ప్రాయములును మెఱుపులతలు ♦ బహుభోగంబుల్
హేయములు సనియుఁబ్రాజ్ఞులు
సేయరు సంసారవాంఛ ♦ సీతారామా. ౯౩

క. నీవిచ్చిన నదులుండగ
నీవిచ్చిన తరులు గిరులు ♦ నిఖిలమునుండన్
గేవల నిజపోషణకై
సేవింపగనేల నొరుల ♦ సీతారామా. ౯౪

క. వెనుకటిపుణ్యము నెల్లను
జనజేసి లభించునట్టి ♦ సంపదలెల్లన్
మనమున గొంచెము చర్చిం
చిన నవి యాపదలుగావె ♦ సీతారామా. ౯౫

క. గేహములందును మేలగు
వాహనములయందు ♦ రమ్యవస్తువులందున్
దేహములందును' నిల్పరు
స్నేహంబు విరాగులెపుడు ♦ సీతారామా. ౯౬

క. దారసుతాదిగ్రాహము
భూరి మహాశాతరంగ ♦ మును మోహ మహా

వారి యపారభవాంబుధిఁ
జేరి తరింపంగ వశమె • సీతారామా. ౯౭

క. వనమైననేమి గృహమై
ననునేమి వసించుటకును • నంబున నిన్నే
మనన మొనర్చుచు మైమఱ
చిన విషయవిరక్తమతికి • సీతారామా. ౯౮

క. స్పష్టముగఁ జెందుఁదృష్ణయె
కష్టంబులకెల్ల మొదటికారణము మహో
త్కృష్టంబగు సుఖమునకై
శిష్టులు గైకొనరు దాని • సీతారామా. ౯౯

క. తిన్నను దినకున్నను ధన
మున్నను లేకున్న నేది • యొదవిన దానిన్
గ్రిన్ననగొని పరితృప్తిఁ
జెన్నొందు మహాత్ముఁడెపుడు • సీతారామా. ౧౦౦

—: మంగళము :—

క. శ్రీ పాణుకుపాటి వతుల్ల
దీపక కోటయ్య వరను • ధీనుతనామా
తాపసమనోబ్జధామా
శ్రీ పృథ్వీజాభిరామ • సీతారామా. ౧౦౧

క. సురుచిర సీతాలక్ష్మణ
భరతారిఘ్నాది సర్వ • పరిజనయుత శ్రీ
సురముని పూజితభక్త
స్థిరకరుణాకర జయజయ • సీతారామా. ౧౦౨

క. సుందరరూపములగు సీ
బృందారకనుత పదార • విందములకు మా
వందనములెల్ల సతతము
చెందునుగావుత మహాత్మ • సీతారామా. ౧౦౩

క. మంగళ మంగజకోటి ని
భాంగా నిజ భక్త మాన • సాంబుజభృంగా
రంగత్కరుణాపాంగా
శృంగార గుణానుషంగ • సీతారామా. ౧౦౪

క. శ్రీ జానకీమనోహర
రాజీవదళాక్ష కోటి • రాకాశశి వి
భాజితముఖ భక్త యశ
శ్రీ జయకరసదయ హృదయ • సీతారామా. ౧౦౫

క. కందముల శతక మిది యుర
విందమ్ముల సరముమాడ్కి • విరచించితి సీ
కందముగ దీని గైకొని
చెందింపుము శుభములెపుడు • సీతారామా. ౧౦౬

క. శ్రీ పుల్లవర్తి కులాబ్ధిని
శాపతినగు నన్నపూర్ణ • శాస్త్రి సమాఖ్యో
ద్దీపితుఁడను భవదీయ
శ్రీ పదయుగ భక్తియుతుఁడ • సీతారామా. ౧౦౪

క. ఈ పద్య శతకమిలలోఁ
బ్రాపుగఁ జదివినను వినిన • వ్రాసినవారిక్
బ్రోపింపఁజేయు మాధిక
శ్రీ పూర్ణసుఖంబు లెప్పుడు • సీతారామా. ౧౦౫

శ్రీ రామచంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



కాకినాడ. ఎ. పి. పి వర్క్సు యందు ముద్రింపబడియె.

